గులపేర్లు చెప్పి, వారితద్దినమని ఆ "తద్దినాల దొర"యొద్ద శలవుదీసికొని పోవుచుండిరని ప్రతీతి. అదియొక్క పెద్దగాథ. తరువాత నెప్పుడైనను జెప్పెదనుకాని అదేవిధముగా, భార్యాబిడ్డలవిషయ మనినప్పుడు మాత్రము మాతహసీల్దారు ఇంతవఱకెన్నడును శలవర్జీని వృథాపఱపలేదు.

ఆదినమున (శుక్రవారము) మధ్యాహ్నమాఫీసునుండి యొంటిగంటకు బయలుదేరి, యింటికివచ్చి, నాతల్లితో చెప్పి, పిల్లవానికి బజారులో మిఠాయినిగొని, రెండుగంటల లోపుగా పడవలరేవును జేరి, ముందుబయలు దేరనున్న పడవను కనుగొని యెక్కితిని. నేను నాయిల్లు దాటివచ్చునప్పుడుమాత్రము, వీథిలోని రాయియొకటి కాలిబొటనవ్రేలికి తగులుటచే నది యపశకునముకాదని నిశ్చయించికొని బయలుదేరితిని కాని, వ్రేలిబాధ మాత్రము మధ్యమధ్య నావిషయమును జ్ఞప్తికి దెచ్చుచుండెను. స్వల్పముగా వీచుచున్న పైరుగాలి సహాయమున మాపడవ బయలుదేరెను. దినమెల్ల బడలియుండుటచేతను, లోనికేగి, త్వరలో గాఢనిద్రామగ్నుడనై పోతిని.

సుమారు నాలుగుగంటలకు ఉక్క ఎక్కువగ నుండుటచేతను, ఎండతీవ్రత చతను దేహమంతయు స్వేదమయమగుటచే, నిద్రనుండి మేల్కాంచి, పడవలోపలిభాగమునుండి పైతట్టుపైకరుదెంచి కూర్చుంటిని. సాయంకాలము కావచ్చినను, ఎండ నిప్పులజెఱుగుచుండెను. ముక్కురంధ్రములనుండి వేడిశ్వాస వెలువడుచుండెను. ఎచ్చట నొక్కయాకైనను కదలకుండుటచే, వాయుదేవుడు కూడ నిలిచిపోయెను. ఆవేసవికాలమున నిట్టిలక్షణములు ప్రకృతియందు దెట్టితీక్ష్ణతను గలుగజేయునో అందఱు నెఱింగినవిషయమే. పడవకళాసులు తెరచాపదించి అందినప్రదేశములయందు గడలసహాయమున పడవను ముందునకు సాగించుచుండిరి. రాజమహేంద్రవరమునుండి ఆరేడు మైళ్లదూరము వచ్చియుండనోపునని మేమూహించి, నడుమనడుమ, గోదావరినుండి యుదకము సంగవస్త్రసహాయమున చెంబులతో పైకిదీసికొని త్రాగుచు, స్వేదరూపమున దానినంతయు వెలికిగ్రక్కుచు, బహిరంతస్తాపములచే నేనేకాకుండ, పడవలోనివారెల్లరును గూడ తహతహపడుచు, నీటిలో కూర్చుండినచో, శీతలముగానుండునేమో యని మేము నుకొంటిమి.

ప్రకృతి మాప్రార్థనల నాలించెను కాబోలును ఆకసమున నొకమూల చిన్న నల్లటి మచ్చవలె గన్పడుచుండిన ప్రకృతి సేవకు డుప్పొంగినట్లు కొంచెముకొంచెముగా నభివృద్ధి నొందుచుండెను. కళాసులు దానిని గమనించి "వచ్చెగాలిదుమారము— సుడిగాలివచ్చింది" అని కళవళపడుచు పడవను సుమారు నూటయేబదిగజముల దూరమున నున్న యొడ్డునకు జేర్చుటకై విశ్వప్రయత్నము జేయనారంభించిరి. తన స్వేచ్ఛాప్రచారమున కీతప్పత్రాగినకళాసులా యడ్డువారనికాబోలును, తనసహాధ్యాయియగు వాయుదేవుని సహాయమును దీసికొని, మేఘ మాకస

మంతయు గప్పివైచెను. ఒడ్డును జేరగలమా లేదా అని, చీకాకుపడుచు, తటతట కొట్టుకొనుచున్న గుండెలతో దిగులుపడుచున్న ప్రయాణికుల ప్రశ్నకు సమాధానముగా కాబోలు "రంయి, రంయి"మను ధ్వనితో సుడిగాలి వీవ మొదలిడెను. పడవయొక్క తెర చాప నదివఱకే దింపియుండుటచే కొంతవఱకు వాయుతాడనము మాకు మొదట బాధకరముగా గన్పడలేదు. అప్పటికి మే మొడ్డునకు సుమారేబదియిరువది గజముల దూరము వఱకు పడవతో చేరగల్గితిమి. గాలి విజృంభించెను. ఇటునటు నుయ్యాలవలె, పడవ, యూపబడుచుండెను. కళాసులు సర్వవిధముల బ్రయత్నించుచుండిరి. 'పట్టిసము వీరభద్రా! రక్షింపు'మని గోలపెట్టుచు ఏ నిమిషమున, పడవ తలక్రిందగునో యని భయముతో నిల్వబడియున్న ప్రయాణికుల'నున్న స్థలములనుండి కదలినచో పడవ తప్పక తలక్రిందగు'నని కొంచెము మోటుగా పడవవాండ్రదలించుచుండిరి. గాలితాకుడుచేతను, పడవవాండ్ర ప్రయత్నముచేతను, గట్టునకు ముప్పది గజముల దూరమువఱకు పడవపోగలిగెను. అప్పుడొక కళాసును,నొక ప్రయాణీకుడును ధైర్యముదెచ్చుకొని పడవ త్రాటిని పట్టుకొని, గట్టున కీదుకొనిపోయి, తమవెంట పడవను లాగుకొనవలయునను సంకల్పముతో నీటనురికి, గట్టున కేగుచుండిరి. కాని ఆగాలిలో నెంతవానికైన కన్నులను మూసికొని, ఎదురీదుట కష్టసాధ్యమే! వారింకను నొడ్డును జేరనేలేదు! ఇంతలో పడవ తెరచాపకొయ్య, ఆగాలి దెబ్బకు, "ఘుర్ర"ని విఱిగి, "దబ్బ"ని క్రింద పడెను. ఆతొందరలో నిటునటు తప్పుకొనగల వారము తప్పుకొంటిమి కాని దురదృష్టవశమున నాకొయ్యపడుటలో నొకనిజబ్బపైబడి, వానిని పడవతట్టుపై పడద్రోసి, యొకముసలియామె తలపైబడి క్షణములో తట్టంతయు రక్తమయమగునట్లు చేసెను. ఆముసలియాపె, యాక్రందనమును; రక్తసిక్తమగు నాతట్టును జూచి నాగుండెలు "గుభిల్లు"మనెను. ఈ హడావిడిలో పడవ ఇటునటును భయంకరముగా నూగజొచ్చెను. "బ్రతికియుండిన బలుసాకైన దిని జీవింపవచ్చునని" తలంచి చిన్ననాడెప్పుడో పదిబారలదూర మీదినజ్ఞాపకము దెచ్చికొని, నేనును, నీటిలోని కురుకనిశ్చయించుకొని, పడవ పట్టిసమెప్పటికైన జేరినచో, నాసామానును జాగ్రత్తగా తేవలయునని కళాసులకు జెప్పి నీటిలోని కురికితిని. నీటిని తాకినంతనే నాకొడలంతయు జలదరించెను. చేతులార బుద్ధిపూర్వకముగా గంగాప్రవేశమైతిని!

ఏనాడీదినయాత! కాకినాడలో కాలువలో నెప్పుడో పదిబారలదూరము పదిమంది మిత్రులమధ్య ఈదనేర్చిన నాకీయఖండగోదావరిలో నొకబారమైనను పడకపోవుటలో నాశ్చర్యమేమున్నది! ఆజలరాశిని, ఆ ప్రకృతి భయానకరూపమును జూచి, గట్టుచేరగలనా యని నాకనుమాన ముదయించెను. ఆ యనుమానముతోడనే నీరసముకూడ బయలుదేరెను. పడవలోనే నిలిచియుండినచో నలుగురితోపాటే కాగలదనియు, నీవిషమావ

...నేనే తెచ్చుకొంటిననియు, నిందించుకొనిన నేమి ప్రయోజనము? ఎట్లులో పదిబారల దూరము పోవుసరికి కాయాస మారంభించెను. చేతులు లాగజొచ్చెను. ఒకసారి నీటిపై నిలువ లేక, యొక గ్రుక్కెడు నీరుకూడ మ్రింగవలసి వచ్చెను, "చచ్చె, బ్రాహ్మణుడు చచ్చె" నని పడవలోనివారి యాక్రోశము స్ఫుటముగా నాకు వినబడెను. ఇంతలో మొదటబయలు దేరినయిద్దరును నాయవస్థనుజూచి, తమ చేతియందున్న బలమైన పడవ త్రాటినిపట్టు కొని నెమ్మదిగా రావలసినదని నాకు ప్రోత్సాహము గలుగజేయుచు నీటిపై యాత్రా[illegible] నాయొద్దకు జేర్చుటచే దానిని బట్టుకొని, [illegible]కష్టముతో నిక నొకరెండు బారలు చేయగల్గితిని, అప్పుడాయిద్దఱిలో కొంచెము [illegible]ంతుడైన ప్రయాణికుడు తిరిగి నీటిలోని [illegible] నాయొద్దకుజేరి, తానొక చేతితో [illegible], రెండవచేతితో, నాకు నడుమనడుమ సహాయముజేయుచు, నాగాలిదుమారములో [illegible]కల కొద్దిన కీడ్వగలిగెను. గాలి [illegible] తగ్గలేదు. నాలుగు నిమిషముల కాలము శ్రమతీర్చుకొని, పడవ నొడ్డునకీడ్చ [illegible] మేము ముగ్గురము నెంత ప్రయత్నించి [illegible] గాలిభారముచే, [illegible] కాక పోయెను. తుదకు విసిగి వేసరి, చేరువనున్న యొకతుమ్మచెట్టున కా త్రాటిని గట్టిగా బంధించితిమి. అరగంటవఱకు నాగాలి మరల లేదు. తరువాత నాలుగైదునిమిషములవఱకు చినుకు [illegible], తిరిగి ప్రకృతి నిర్మలమై పోయెను. గడల [illegible]యుటచే, ఈసారి పడవ నొడ్డునకీడ్వగలిగితిమి. కాని, పడవవాండ్రా రాత్రికి దాని నచ్చటనే కట్టియుంచెదమనియు, తిరిగి పైరుగాలి తిరిగిన గాని, బయలుదేరమనియు చెప్పుటచే సమీప గ్రామస్థు లిద్దఱు నాకు తోడువచ్చెద మనుటచే, నావస్తువులను పడవవాండ్ర కప్పజెప్పి, నాబిడ్డకై కొనిన మిఠాయిపొట్లమును దీసికొని, అచ్చట కింకను పట్టిసము 11 మైళ్లున్నను, రాత్రి 10 లేక 11 గంటలకైన నిల్లుచేరగలనను నమ్మకముతో నీరసముగా నున్నను, భార్యాబిడ్డలను జూడవలెనను నాత్రముతో బయలుదేరి, నడుమనడుమ కూర్చుండుచు, అర్ధరాత్రికి పట్టిసగ్రామసమీపమును జేరితిని. అచ్చట నాతోవచ్చిన ప్రయాణికులిద్దరును నాకు దారినిజూపించి, తమదారి నేగుటచే, నొంటిగా గ్రామమును బ్రవేశించి, తిన్నగా నామామగారియిల్లు జేరి, తలుపు దట్టితిని. అర్ధరాత్రమగుటచే కాబోలును నాకెవ్వరును బదులు పలుకకుండుటచే తిరిగి రెండుమూడు సారులు తలుపును గట్టిగతట్టి "తలుపు! తలుపు!" అని అరచితిని.

'ఎవరువారు? దూరముగానుండండి తలుపుదీసెదను" అని కాబోలును నిద్రాముద్రాంకితమైన యస్ఫుటనాదము విని "నేను- తలుపుతీయండి" అని తిరిగి హెచ్చరించితిని. ఆలోపలనుండి వచ్చినశబ్దము మాయత్తగారిమాటలువలె నుండుటచే నేనీసారి సగౌరవముగా నంటిని. ఇంతలో నాపతివ్రత "తలుపు ముట్టుకొనకండి, తీస్తాను" అని సహజస్వరముతో, [illegible] తలుపుదీయుటకు లేచెను. తల్లి

కూతురు లిద్దఱు నొకేస్వభావముగలవారని నేను మఱచితిని. తలుపుదీసి కొంచెము వెనుకకొత్తిగిలి, "నన్నట్లువీథిలోనికి పోనీయండి, మీరు లోపలకు బోవచ్చును" అనెను. ఇదివఱకున్న స్వల్ప ఉత్సాహము కూడ నింతటితో నశింపగా, నాయరుగుపై చతికిలబడితిని. నాభార్య యింటిలోనికి పోకూడదని గ్రహించుటయే నావిషాదమునకు గారణము; కాని నాకష్టము లంతటితో తీరలేదు.

"మంచిసమయమునకు వచ్చినారులెండు! నిన్నయుదయము, అమ్మయు నాన్నయు, శీతానగరము పోయినారు, తాతయ్యమాత్ర మింటిలో నున్నాడు. నేనీసాయంకాలము బయటజేరితిని. గ్రామములో నింకొక బ్రాహ్మణుల యిల్లు లేదు కదా, ఎట్లుచేయవలెనని యనుకొనుచున్నాను, తాతయ్యకు కండ్లు కనబడవు గదా గోదావరి నీరెట్లు"

"ఛీ, నోరుమూయుము, పాడుగోల నీవును!" అని నావిసుగుదలనంతయు వెల్లడించితిని. ఆమె నాకప్పుడు చెప్పుచున్న దానికర్థమిది. "ఇంట వంటచేయుటకు దిక్కెవ్వరును లేనికాలమున, సమయమునకు నేను వచ్చితిని కదా, ఇక నామెకు భయములేదట. సోమవారమువఱకు వంటచేసి, నాభార్య బుతుస్నాతమైన మధ్యాహ్నమో, సాయంకాలమో బయలుదేరి నేను తిరిగి రాజమహేంద్రవరమునకు బయనమైపోవలయును కాబోలు"నను విసుగుచే నేనామె నదలించితిని కాని నాయవస్థ యంతయు వినినతర్వాత నామె పడిన సంతాప మింతింతకాదు. ఆసంతాపమునో వాయుదేవుడును, పడవవాండ్రును, అధికముగా కలపీయని నాయధికారియు, నామె శాపాగ్నికి గుఱియైనను, నా కేమియానందము?

ఆమూడుదినములును వంటరాని హేతువుచే నుడికియు నుడకనిపాకము భుజించుటచే గలిగిన కడుపుబాధతోడను, అలవాటులేనినలత్వముచే కాలిన చేతిబాధతోడను, అప్పటనే యవలంబింపవలసిన గంగాధరత్వముచే గలిగిన యొడలినొప్పులచేతను, కేవలమును కొంటెయగు నామూడేండ్ల ప్రాయముగల బిడ్డచేసెడు నల్లరివలనకలిగిన చీకాకుతోడను, అన్నింటికంటెను, నాప్రయాణము తుదకిట్లు పరిణమించెనుకదా యను నవమానముతోడను, నేను పడినయవస్థ శత్రువునకైన కోరరాదని నేననుకొనుచు, సోమవారము నాడు సాయంకాలము కొవ్వూరున కేర్పాటు చేసికొనిన యొంటెద్దుబండికై వీథియరుగుపై కనిపెట్టుకొనియున్న సమయమున, నేను ఆ చమత్కారమునకు మెచ్చుకొందునను సంతోషముకాబోలును, నాభార్య నాయొద్దకువచ్చి, "సమయమునకు దేవుడువలె వచ్చి ఈమూడుదినములు గడిపినారు—"అని ప్రారంభించెను.

"ఎవరినైన పంపి, శీతానగరమునుండి నీతల్లిదండ్రులను బిలిపించి, సరిగా వారము దినములలో రాజమహేంద్రవరమునకు నీవు రాకపోయినచో ఇక నాసంగతి; తెలియునా?" అంటిని. ఆమెకు నవ్వువచ్చుచున్నను, పరాభవాగ్ని నన్ను పీడింపజొచ్చెను. కాని, ఈ పరాభవమున కామె నేల నిందింపవలెనని, నాలోనేను శాంతిబొందితిని. తిరిగి పడవపై బ్రయాణముజేయవలదని నాభార్య నిర్బంధించుటచేతనే, నేనాదినమున కొవ్వూరున కొంటెద్దుబండిపై బయలుదేరవలసి వచ్చెను. "కానరానికష్టములకు" గర్తలెవ్వరో, ఈనా కష్టములకుకూడ బాధ్యులువారేయని నాలో నేను తృప్తిబొందవలసి వచ్చెను.




అనిపెద్ది జగన్నాథశాస్త్రి గారు

కనులన్ సమ్మదబాష్పముల్ గురియఁగా గాత్రంబు రోమాంచముం
గనఁగాఁ జిత్తము పారవశ్యమునఁ దూఁగన్ గుత్తుకన్ గద్గద
స్వనమొప్పారఁగ నస్ఫుటంబులగు బాసల్ వల్కుచున్నాఁడ వె
వ్వనితోనో? వివరించి చెప్పు మిట భావంబిచ్చి, భక్తాగ్రణీ!

మ. చిరజీర్ణంబు, విశాలపత్రశతసజ్జీభూత, ముద్యద్ఘుణా
క్షరముం, జందనపంకసిక్త పటురక్షాపత్రమున్, యుష్మ దా
దరపాత్రంబు, హృదంతరస్థితకరాంతస్థంబు, శ్రీరుక్మిణీ
వరచిత్రాన్విత, మద్ది భాగవతమా? భాషింపు భక్తాగ్రణీ!

మ. తగుకాలంబుల నిత్యకర్మముల నిద్ధశ్రద్ధ గావించుచున్
సగుణబ్రహ్మముఁ బార్థసారథిని బూజల్ సేయుచున్, రజ్జుస
ర్పగతిన్, దేహ మనాత్మనాఁ గనుదు వైరాగ్యంబుఁ, బూర్ణంబుగా
భగవద్గీత పఠించినాఁడ వని నే భావింతు, భక్తాగ్రణీ!

శా. నీచిత్తంబునఁ దోఁచురూప మది వర్ణింపంగనౌ నేని నీ
ధీచాతుర్యముఁ జూపి చెప్పు మది యేదీ? బర్హాచూడంబొ? నీ
తాచేతోహరమో? సుధాకరకళోత్తంసంబొ? మూర్తిత్రయ
ప్రాచుర్యావసథంబొ? ముక్తజనతాభావ్యంబొ? భక్తాగ్రణీ!

మ. తులసీమాలలు కంఠభాగమున ముద్దుల్ గుల్క, హస్తాబ్జముం
గళతాళధ్వని మిన్నుముట్టఁ బద యుగ్మం బంటి సత్కింకిణీ
కలనాదంబు సెలంగ, నృత్యమును వేడ్కం జేయుచున్, మూఢులన్
దలలన్ ద్రిప్పఁగఁ జేయఁ జాలితివి జోతల్ నీకు భక్తాగ్రణీ!






## క్రొత్తపల్లి సూర్యారావు గారు

మహాపతివ్రతలకు నమస్కారము. అసూయ లేని తల్లులకు దండములు. గర్వరహితలైన జననులకు మ్రొక్కులు. శాంతస్వభావముగల మాతలకు జోతలు. ఏ ముగ్గురు తల్లుల దయ లేకున్నఁ బ్రపంచములోనివారు తలయెత్తుటకు వలనుపడదో వారికి సాష్టాంగములు. ఏ పురుషుఁడు రాకున్న లోకములోని కథలకు గాథలకు మొదలుగాని తుదగా నిదొరకదో వారికి మోడ్పుఁగేలు. సకలకల్మషములను దొలఁగించు గంగాదేవికి వందనములు. తలయెత్తి గగనముమీఁదికి రెండుచేతులు జాఁచి జయజయధ్వానము చేసితిమా వైకుంఠమును సత్యలోకమును మనస్తోత్రములు చేరినట్లు వెంటనే ప్రత్యుత్తరమిచ్చు తంత్రీమార్గము ఖేచరవాణికి స్తుతికదంబము. లోకులకు భక్తి కుదురుటకును, గర్వము తొలఁగుటకును, మంచిపేరు గడించుటకును, మహాత్ముల మహిమముఁ దెలిసికొనుటకును లోకజ్ఞానము సంపాదించుటకును, దోషములు నశించుటకును, సన్మార్గమున బుద్ధి నిలుచుటకును బుద్ధిశాలులైన మన పెద్దలు బహుకాలము క్రిందటనే విశేషముగాఁ బ్రసంగవశమునఁ గథలక్రిందఁ గొందఱచారిత్రములు వ్రాసిపెట్టిరి. అట్టివానిలో నేను నిన్న మొన్న నొక్కచో నొక్కకథ విని నా చెల్లెండ్రకు వినిపించుమన్నాఁడను. ఒక్కసారి చదివినంతనే తెలియునంత తేటగా నున్నది. నా వ్రాఁతలోనే కాని కథలోఁ దికమకలు లేవు. విషమసంధులు లేవు. సందేహములకు సందు లేదు. నా వెఱ్ఱి నన్ను విడువలేదు. సహోదరీతిలకములార! దినదినమును దీనిని బఠించి నా వెఱ్ఱి యేదియో కనుఁగొంటిరా కొన్ని దినములకు నాకు సంతోషము గలుగును. నిర్మల హృదయములతో నా వ్రాఁతలను జదివి పరీక్షించిన నా మేనగోడండ్రకుఁ గొన్ని రహస్యములు మీరు తెల్పఁగలరు. కథ చెప్పెదను వినుండు.

అగ్గికిఁ జెదపట్టునా! పట్టినదని చెప్పుకొనుచున్నారు. ఒకప్పుడుఁ దనలో దిగి మునిఁగిన వారి పాపములను బటాపంచలుచేయు గంగాదేవిని మనము విడిచిపెట్టిన పాపములన్నియు మొత్తమై "చూచితిరా బుద్ధిలేని నరులకు బుద్ధివచ్చుటకై మనము పట్టుకొని వారిని బాధించుచుండ సహింపక గంగ మనదారికడ్డు వచ్చుచున్నది. కాఁబట్టి దీనినెట్లయినఁ గష్టపెట్టవలయును. అర్జునుని సంశప్తకులు చుట్టుకొన్నట్లు దీపము మీఁదికి దివ్వారుపుఁ బుర్వులు ముసరికొనునట్లు చుట్టఁబెట్టుకొని యెవ్వరికిని లొంగక గంగను గలఁతపెట్టుటకంటె వేఱుమార్గము మనకుఁ బగతీర్చికొనుటకు లేదు." అని గూడుపుఠాణీ చేసినవి. చూచితిరా దురాత్ముల లక్షణములు. లోకుల కష్టములను దొలఁగింపఁజూచు భాగీరథీ ప్రయత్నము వానికి సరిపడలేదు. పట్టుపట్టుమని నడుము గట్టినవి. వాని శరీరములు మసిబొగ్గులకు గురువులు. నీలమేఘములకుఁ దాతలు. కంబళి పురుగులకు మూలదుంపలు. మిడిగ్రుడ్లు, మిట్టపండ్లు కుఱుచచేతులు, తుప్పతలలు, దొప్పచెవులు, దోనెకడుపులు, తొంటకాళ్లు తేలుకొండులవంటి గోళ్లు— చాలు, చిరాకుగా మీకు భయము పుట్టు వర్ణనములను గట్టిపెట్టెదను. ఇట్టిదరిద్రవర్ణనలపై మనసుగలవారును గలరు. వారికై నవలలు నేఁడు [illegible] కోటానకోట్లు బయలుదేరు

మునే యున్నవి. సత్యము చెప్పెదను. ఇట్టి డిట్టి వర్ణనములే లోకులకు రుచి. ముఖము పద్మమును బోలునని చెప్పిన- ముఖములో రేకులున్నవా, కింజల్కములున్నవా, మిద్దెలున్నవా, పరాగమున్నదా, సరియైన పోలికి లేదు. స్వభావముగా వర్ణించుటచేతగాదు. చూడుడు యీ మినీతిలకలో - జగదేకసుందరిని శోకపాలుడు వర్ణించినాడు. ఆమె ముఖము చూడగనే దుఃఖహృదయులకు దుఃఖము పుట్టును. సంతోషముగా నున్నవారికి మఱింత సంతోషము కలుగును. ఏడ్చుచున్నవారు చూచిరేని యేడ్చుచున్నట్లే కనబడును. దుఃఖమునకు జెల్లెలు. సంతోషమునకు తోడబుట్టు. ఆనందమునకు వేఱువిత్తు. ఆహా! యిట్లుండవలదాయని యిప్పటికవులు పూర్వులను దిగదుదురు. పోనిండు మనము వీరిని దెగడనేల. ఎవ్వరికిష్టములైన గ్రంథములు వారిని జదువనిండు. పాపములు గంగను జుట్టుకొన్నవి. పైబడలేవు. వెంబడింపలేవు. ముట్టుకొనలేవు. తాడబోవును, గిల్లజూచును, అక్కడదలచును. తొలకగడగును. ముందునడచుటకు గాలాడునంతస్థలమీయవు. చేయి విదుచుకొనుటకు జేసెడు, లోడితెడు, బెత్తెడు సందుండనీయక క్రిక్కిరిసి, నేడుగాదు, నెలగాదు, సంవత్సరము గాదు యుగములకొలది బాధింపజొచ్చినవి. మనకు గష్టముల నడుమ రెండుదినములు వాసుకరమైనదా సహించి దానిలో మెలగగలము. గంగకు మాత్రము పాపముల నడుమ నెన్నినాళ్లుండినను ప్రాంతము కాలేదు. ఇన్ని నాళ్లు సావాసము చేసిన వారు వీరగుదురన్న సామ్యము గంగయొద్దవ్యర్థమైనది. పాపము! పాపములొక్కసారిగా గఱచుటకు నోరు దెఱచినను గంగ కన్నులు మూసికొనును. బరువుటను గోళ్లు విప్పి మొగము [illegible] జేతులెత్తిన రెండుచేతులు మోము పైగప్పుకొనును. సాధనములు వెదకినది. పెరటిచెట్టు మందునకు రాదు. తొన్న సరస్వతిలోనో యమునలోనో మునిగినను బాపములు తొలగునా యని తలచెను. ఏపుట్టలో వేసామున్నదో యని తొ నెతెంగియున్న సమస్త నదులలో తుదను చాటిపడినముల్లో - మునిగినట్టి మఱింత పంకమంటుకొన్నదిగాని తగ్గలేదు. ఎక్కడికైన బోయి గట్టి, సామ్యము చూచుకొనవలయును.

డొల్లపెట్టెలు మేకులూడిదియు కాలువతో దవకు కూడదిసికొనుట కింకొకకాలు కావలయును. అందు పాపములను బోగొట్టు దానసైనను నాపాపములను బోగొట్టుట కింకొకరిసహాయము కావలసివచ్చినది. అట్టి మహాత్ముడెవ్వడు? పరమేశ్వరుడు గాక మఱి యెవ్వడు? గంగ యోజించినది. ఈపనికి మగవారి దాక బోవలయునా. ఆడువారి బాధ లాడువారే తొలగించుకొనుటకై - స్త్రీలవైద్యశాలలు, స్త్రీలపాఠశాలలు, స్త్రీలసభలు, స్త్రీలకు స్త్రీలే-ఆహా! భూలోకమా! మూడు లోకములకు నీవు మధ్యవర్తివి. మగవారికంటె ప్రతికార్యమునకు స్త్రీలే ముందు - ఆడుదాని చేయబూనని పని లేదు. ఉద్యోగము మొదలు యుద్ధమువఱకు - సపరికరము, సాయుధము, సవాహనము, సపతికము, సపుత్ర పరివారము. ఓ స్త్రీ సమాజమా! వచ్చుచున్నదానను. అయ్యో! పరమేశ్వరుని గావని యబలల వేడుట యేల? ఉండనీ, యెప్పటికైన బుద్ధికి వత్తురు. మనమగవలను వేయేండ్లు వర్ధిల్లనిమ్ము. నిస్సందేహముగ స్థలమునకుబోయి త్వరలో గుదుర్చుకొనక- అసునాకాదా! ఏమో! అనుసందేహస్థలమున కిపుడువలదు. ఇట్లని తమలోనిలోపములను దలచుకొని- భగవంతుని వైపునకే మరలినది; దేవా నాపాపములను బోగొట్టుము. నీ సెలవుపై నేను పాపుల పాపములను దొలగింప నుద్యోగములో గుదిరితిని. పళ్లు పుచ్చినవ లేక మందు తనకు బనికిరాకపోయిన నతని వైద్యమేమిపనికి చేదుకాకరకాయను జక్కగాపండి యుందనకు బెట్టు వంటవాడు దానిందినజాలడు. ఓ సకలేశ్వరా! నన్నుగాంచి లోకులు నవ్వకుండ గాపాడుము. ఎప్పుడుదీపము సన్నగిల్లునా! యెప్పుడు చుట్టబెట్టుకొందుమా యని దీపప్రాణము నాశ్రయించుకొన్న చీకటుల వలె నన్నాశ్రయించుకొన్న పాపములు నా నాశము గోరుచున్నవి. కన్నుల్గ్రాగిన వారి చేతిలోని బిడ్డనై యున్నదానను. అలజడి యెక్కువయినది. కలగుండు వడచుంటివి, పంకమున్న నన్ను దీర్చుము. దుఃఖప్రవాహమునుండి నన్ను దరిజేర్చుము. అని పరిపరివిధముల దేవుని వేడికొనినది. రాజుగారిచ్చే [illegible] ప్రార్థనా మంత్రమునను [illegible] మూర్తి యొద్దనుండి ప్రత్యుత్తరము

వచ్చినట్లు జగదీశ్వరునకుఁ జేసికొన్న వేఁడికోళ్లకు గగనసరస్వతినుండి యీక్రిందిరీతిని ప్రత్యుత్తరము వచ్చినది.

"ఓ గంగాదేవి! వెఱవకుము. నీయాపదలు కాఁపురము చేయవు. వ్రేలుపైఁ గొండయెత్తిన కృష్ణుఁడు మట్టియాకులోఁ దేలినాఁడు. కాలగతిఁ దప్పించుకొనుటకు వశముగాదు. లోకుల పాపములన్నియు నిన్ను గాపవరపు జీఁడివలెఁ బట్టుకొన్నవి. నీది దీర్ఘ జాడ్యము. కాలమునుబట్టి స్త్రీలకు వైద్యము స్త్రీలే చేయవలయును. సంచికట్టుగల వైద్యురాండ్రను వెదకుము. పట్టణములోని వైద్యము పనిచేయకున్నఁ, బల్లెలలోఁబడి నీరుగాలి మార్చికొనుము. మందులు మాత్రలు నీరోగము గుదుర్పజాలవు. ఏవేరో వెల్లంకో రత్నప్రోగో మంత్రపునీరో చేర్చిన సిద్ధురాలిని సేవింపుము. తిరుగుము. కర్మ పరిపక్వము కావలయును. ఏసీమవైద్యుఁడుగాని నవజ్వర పక్వముగాఁదగిన రోగిని సాయంకాలమునకు లేవఁదీసి కూర్చుండఁ బెట్టలేఁడు. రోగము రొట్టువేయును. అతి గర్వముగల దుష్టకవివలె నీకర్థముగాకుండ మాటలాడుచున్నదాననేమో, అచ్చతెనుఁగుగాఁ జెప్పెదను వినుము. కలలోనైనను బరియాచకముగాఁ దనపెనిమిటి కెదురాడక తలలో నాల్కవలెఁ బూసలలో దారమువలెఁ దోడునీడవలెఁ బ్రాడుతో దర్పణమువలెఁ జరించు పతివ్రతను వెదకుము. పతివ్రతయను మాటకర్థము, పతివ్రతకు నీకుఁ దెల్పనక్కఱలేదు. కావలయునేని వేఱొకచోటఁ దెల్పెదను. అట్టి యిల్లాలివలన నీకష్టములు నష్టమగును. కొప్పువెట్టినదెల్లఁ బప్పువండఁజాలదు. బల్లగట్టినంతనే భ్రమసిపోకుము." అని మాటలు చాలించిన యాకాశవాణికి మ్రొక్కి నాకు మేలుచేయుట కేపతివ్రతకడకుఁ బోవుదునాయని గంగ చింతించినది. పతివ్రతను గుర్తించుట యెట్లు? ఏమైనఁ బరీక్షలా, పారితోషికములా? నేను పతివ్రతనని, పెద్దపెద్దలిచ్చిన యోగ్యతాపత్రములున్నవని ప్రకటించుకొందురా? ఇండ్లపైఁ బేరుబల్ల లుండునా? లేకున్న నామె ప్రసిద్ధికి లోపము కలుగునా? మహాపతివ్రత యాకులలోని పిందెవలె నడఁగి మడఁగియుండును. కన్నులేనివారే గాజుకన్నుఁ బెట్టుకొని కన్నుగలవారివలె మెలఁగుదురు. పద్మాక్షి విశాలాక్షి యని పేరులు పెట్టుకొందురు. తప్పుతోత్తములు వ్రాయువారికే శతావధానుల కవిత్వము నిర్ధారణచేసికొన నవసరము కలుగును. కలియుగములోవలె నిప్పుడేమైన వృత్తాంతపత్రికలున్న, ఏ మాన్యశ్రీయో విశేషరియో యేమి శ్యగనవింపో, ఒక్కయూరిలో నొకస్త్రీ - రాత్రిపడిన నెవ్వరికిఁ గనఁబడదు. తెల్లవారకుండ నొరులకంటఁ బడకుండ నిల్లుచేరును. ఆమెను తీసికొనుటకై యత్నము చేయుచున్నారట యని తెలియఁబరచును. అదియును లేదు. అటునుండి వచ్చి కొనిరమ్మనివారు, ముందుగాఁ గైలాసమునకుఁ జని పార్వతిని దర్శించెదను. సతియని యాతల్లి కన్వర్థనామము. సర్వమంగళ, పెట్టకున్నఁ బోయెఁ; బెట్టినచో నైవఁజూపును. ఎల్లలోకముల స్త్రీలును వచ్చుచుఁ బోవుచుందురు. ఆయమ్మకొలువుకూటము వార్తాపత్రికవంటిదియగును. కొంతవృత్తాంతము తెలిసికొనవచ్చునని గంగమ్మ వెండికొండకుఁ బ్రయాణమైనది.



రజతగిరిమీదికి ..గంగ...ఎదురెక్క..లేక తొట్రుపడినది.

రజితగిరి మీఁదికి మిక్కిలి కష్టముమీఁద గంగ యెక్కినది. ఎదు రెక్కలేక తొట్రుపడినది. ఆతిబండలలో దార్లు వింతలు పెట్టి పలుచనై చక్కనివారికిఁ జిక్కుటయు సొగసే యనిపించినది. నేను గొప్పదానను, నాతండ్రి ధనవంతుఁడు, మాదంశమునకుఁ గావలసినంత ప్రసిద్ధి కీర్తియునుఁగలవు. మేము శ్రీమంతులము అని పొంగుటకు సమయముగాదు. కార్యము సాధించుకొనఁదలఁచినవారికిఁ బ్రుబ్లుపాటుతగదు. వినయగుణము మంచిది. ఎట్లో యెక్కినది. 'అక్కయ్యా!' అని యొక్క కేక పెట్టినది. గౌరిదేవియుండు మేడ గుమ్మముకడకుఁ జనినది. ఒక్కముసలి ముత్తైదువవచ్చి, 'అమ్మా! ఏవో పండుగులంట. నిన్ననే వైకుంఠములోనికి వెళ్లినారు. కొన్ని దినములక్కడఁ గడుపుదుర.' అని మనవి చేసినది. "కార్యార్థీః కుతో గర్వః." కార్యము కావలసినవాఁడు గర్వింపరాదు. సరియే పోయివచ్చెదను. మన పనిగాని వానిపనిగాదు. పోనీ తిరిగివచ్చినపుడు చూడరాదా. ఏయుత్సవమో, నన్నుఁ బిలువలేదు. ఇతర సమయములందువలెఁ బండుగులలోఁగూడఁ బిలువకుండఁ బోవుట చిన్నతనము. పిలువని పేరంటము, వేయని విస్తరి. కాని, పార్వతిబసలోనికి మాత్రము వెళ్లి తిరిగివత్తునా. ఎవ్వరైన నారాకఁ దెల్పిరా, 'పద్దుమాడుము. శుభలేఖపంపలేదు! కానిమ్ము, ఇప్పుడొక లేఖవ్రాసి పంపుము. మీకు లేఖ పంపినాము, మీరిక్కడికివచ్చినారు, అది యక్కడకు వెళ్లినది' యని బొంకుదురు. మెరమెచ్చుల చుట్టరికములు నాకు నచ్చవు. పిలువకున్ననేమి? పుట్టినిల్లు, తండ్రి పాదదర్శనము చేసిరావచ్చును. ఒకవేళ దాక్షాయణి 'యిట్టిపను లేకూడవు, పిలువని తావునకేలవచ్చితి' వని, అనుభవమునుబట్టి కూకలు పెట్టునేమో. కూఁతును మఱచిన తండ్రి, యెంత తొందరపనిలో నుండునో. దానికిఁ గాదు. పదిమంది చేరుదురు. నాపరితాపము తీఱుటకు దారి దొరకునేమో గుడగకొమ్ముల సందేహము తీర్చుకొనుటకు. ఇట్లని గంగ పరిపరి విధముల వితర్కించినది. చివరకు వెళ్లుటకే నిశ్చయించినది. వైకుంఠమునకుఁబోయినది. తిన్నగా గౌరిదేవి బసలోనికి కిక్కురు మనకుండ నేగినది. చల్లచల్లగ నమస్కరించినది.

గౌరి—నీకెప్పుడందినది. నీవు నాకంటె ముందే వచ్చియుండుదువని తలఁచి పిలువకుండ వచ్చితిని. లేకున్న నిన్నుఁ బిలిచియుందును.

గంగ—నే నేమియు నెఱుఁగను. మీయింటియొద్దఁ దెలిసినది.

గౌరి—నాకు రావలయునని లేదు. క్రొత్తగా రవ్వల ముక్కుఅచేయించుకొంటిని; ప్రాఁతవి చిల్లరమల్లరలు కరఁగించి యేదోపెద్ద వస్తువు చేయించుకొంటిని; ఏవోకొంటిని. వానిని ధరించునాఁటికి మీరు రావలయును. పూజకుఁ బిల్లవాని నొక్కనిఁబంపి యూరకుండవలదు. అని నిష్ఠురముగా, నిర్బంధముగా, వేడుకగా వ్రాసినారు. మీ బావలేరు.

గంగ—జట్టు విడిపోయినారు. ఆయన కెక్కడ ప్రవణ! మీరిద్దఱుఁగలసియే వచ్చిరనికొంటిని. (తనలో) ఈమె పతివ్రతల పద్దులో మొదటిది. పతిని విడిచి-

గౌరి:—ఎక్కడనో లక్షపత్రి పూజలు, సహస్రఘటాభిషేకములు.

గంగ—పోనీ, యీక అవుదినములలో నింటఁ గూర్చుండినఁ బొట్టగడవదు. తిరిగి రానిమ్ము.

గౌరి—పిలువలేనట్టున్నది. పిలువనిదే యేలవచ్చితివి?

గంగ—నీయొద్దకు రావలసి, అని చెవిలోఁ జెప్పను. గంగ పలుకులు గౌరిచెవిని బడినవి. గఱుసరి. నేను సుప్రసిద్ధురాలనే, లక్ష్మితోఁజెప్పి యేమైనఁజేయఁ గలదేమో చూచెదను. నేను బతివ్రతనని గర్వముగలది. అని లక్ష్మికడకుఁ దీసికొని పోయినది.

గంగనుజూచి లక్ష్మి 'మీనాయన నీకుఁ దల్లికంటె మిక్కిలి దగ్గఱవాఁడు. ప్రేగుండఁబట్టునా. పిలువఁగానే వచ్చితివి. చాలసంతోషము.' అనినది. గంగకు వింతయైనది. ఇదియేమిటి, నే ననుకొన్నదే. అని లోలోన నవ్వుకొని 'నేనొక్కచోట నుందునా, పిలుపు నాకందలేదు.' అని పలికినది. లక్ష్మి తనలో "పట్టి పిలుపులందవు. ఏ యూర్మికలోఁబంపినపుడందును." 'నేనిపుడేమియన్నను నాకు గజ్జెలపట్టెడ చేయింపలేదని కోపముచే ననుచున్నట్లు తలంతురు, కొందఱున్నారు. తాము చీర

సేయించుకొన్నపుడు తమ భార్యలకుఁగూడ నొకటి సేయింతురు. తమరు దండకడియములుగాని మట్టెలు మంగళసూత్రములుగాని చేయించికొన్నపుడు తను భార్యల కింకొక జత దానితోపాటుగానే చేయింతురు. మా యింటిలో నట్లుగాదు. తమ సొమ్ముగాదు. కాకపోయి నను మాకుఁ బెట్టునప్పు డెంత మప్పితమైనను వచ్చును. ఏతిరుపతివార్లో కిరీటము, ఏ శ్రీ గంగమువారో హారములు, ఏకంచివారో రత్నములు సమర్పింతురు. అపత్నీ కునికై నను విడిదెకట్నముపలె నొక్కరి కీయఁగూడదని కొందఱు,జామారుతోఁగూడఁ-బోగుపొట్లకాయలావుది- యొక్క నాలుగుమూరల గడ్డమో రెండు తులముల యెత్తుమట్టెలో, కన్నుల నీరు తుడిచిన నికనంతే- అని కొని- సరితెలిసినది. 'నీవువచ్చిన కార్యము- ఈదినములలో మాపాతివ్రత్యము, ప్రాతవడింది పనికిరాదు. ఆనాఁటికి మేమే- ఇపుడందఱు నేనని నేనని లేచుచున్నారు. కట్టుకాలు విచ్చలవిడిగా లేచినది. ఆసతీపతుల యొద్దిక ఆసహాయానము- ఆసల్లాపము- ఆచనవు- ఆయుచితసేవము వేఱు-మేమే దో మూలఁబడి యుండువారము-మమ్మెవ్వరు చూచెదువారేకారు. మాకోడలు సావిత్రికిఁ, బైకిఁ దెలియనీయక గుట్టుగానున్నను, దానేదో కొంచెము కొమ్మమీఁది కొంగను బడఁగొట్టెదనని గర్వమున్నది. నేనంటినా- కోడలిగుణము లత్తకు నచ్చవనియందురు. పైకి మేము శాఖాభేదములు పాటింపము. స్త్రీలని పురుషులని యెచ్చు తగ్గులు మాకు లేవని పలుకుచున్నను గౌరవము మాత్రము స్వపక్షమునకే ములుచూపుమండుట తెలియుటలేదా. కనుఁగొనవలయును. గంగమ్మకూఁతురా! మే మీకాలపువారముగాము. మాకట్టు మాబొట్టు చూచి పడుచుకాలువాండ్రు నవ్వుదురు. మామాటలు చెల్లవు-మాకాలము గడచినది. పేరు పెద్దతనముగాని కార్యములు మావఁ నఁగావు. మేము తెగించి, యెంతచన వున్నను, భర్తలతో సభలకెక్కుటకు, ముసలితనములోఁ గూడ జంకే. పతివ్రతయనఁగాఁ బతితోఁగూడ నుండుట యే వ్రతమఁట. అనువ్రత- యనఁగా నతఁడెక్కడకుఁ బోయిన నక్కడికెల్లఁగూడ బొక్కిసావలె వెంటాడుట యఁట. మీయిదినె నడుగు; ఎన్ని యర్థములు చెప్పునో' అని యుపన్యసించిన లక్ష్మి మాటలలోఁ గోడలును నిందించుట-తాను జల్లగిఁ దప్పుకొనఁజూచుట- కని పెట్టి గంగ వీరివలనఁ బని సాగదనికొనియెను.

కుంకుమబరణి చేతఁబట్టుకొని సావిత్రివచ్చి గంగకు బొట్టుపెట్టి 'మామగారికి ముసలితనములో సొగసు లెక్కువ యగుచున్నవి; సాయంకాలము పీటలమీఁదఁ గూర్చుందురు. నలుఁగులు రాహుకాలము రాకుండనే మొదలుపెట్టెదము.' అని చెప్పుచుండఁ దన్నుఁ గూర్చి కోడలు వేళాకోళముచేయునేమోయని లక్ష్మి పని కల్పించుకొని లోనికిఁజనినది. సావిత్రి, గంగతో, 'నీవు చిన్నదానవైనను బెద్దదానవైనను- ఇంటి యాఁడు బిడ్డవు- ఎల్లపుడు నింటనుండు కోడలికి నాకొక్కనగ లేదు; ముసలిము త్తైదువకు, అత్తగారికి ముక్కులో ముల్లనరు- మగవారికి ముసలివారికి నగలేమిటి ! మీ నాయన నంటినని కోపమువలదు; నీవెఱుఁగవా! అఱువది యేండ్లప్పాఁడు. రెండవ పెండ్లి చేసికొని బారసాల పీటలపైఁ గూర్చుండినట్లు, మామగారు పీటలమీఁదఁగూర్చుందురఁట- నలుఁగులఁట, నగలు ధరింతురఁట- కొవ్వునీరధి బిరుదమును నాకుఁ బండితులిచ్చుచున్నారు. మీ రానాఁటికి రమ్మని యందఱకు నుత్తరములు వ్రాయువారివెల్త, నగలుచేయించి యిచ్చువారొకరు, ధరించు తాము, శుభతే ఖలా! దీని కగువ్యయమైనను దమడిగాము. అందఱు గౌరవముగానీయుత్సవ జ్ఞాపకార్థముకట్నములు, కానుకలు, చదివింపులు- లక్షలు మూలధనము ప్రోగుచేసి, ధర్మకార్యములఁట- దురాచార నిరాసకములఁట, ఇట్టి వేడుకలకు రమ్మనిన వీరు తొగుదురుని పోయి యలంకరించుకొని యున్నతస్థానమునఁ గూర్చుండి లోకులు పొగడ్త పొగడికలకుఁ జెవియిచ్చి వినుటయెట్లు? పోనీ, ఇంట మ్రగ్గులుగు చున్నది. లక్ష్మీవంతులు- ఆమూలధనము లోనికిఁ దామొక్క ఛిల్లిగవ్వ, తమకష్టార్జితము- పోనీ ఒక్క వెలకు- బీదవిద్యార్థి జీతము- మాకాయవ్యయము, మాకారోగ్యము- ఊరందఱును దమ్ము బ్రహ్మరథము పట్టుచున్నపుడు సంతోషమా, నాకెందుకు- మీకీ వ్యయ మేల? యనిమాటవరుసకైన- ఇట్టి వారొక్కరి నా క్షేపించుటయా- ఢంకామీఁద దెబ్బగొట్టి శిశుపాలుఁడు తెగవేసి యడిగినాఁడు. ఏమయినను గాని- యాతఁడే నాకు నచ్చినవాఁడు. వదినవో మఱఁదలివో, నిన్నుఁ

గంగ—నీకడుపుచల్లగ, వీరిని మనచేతిలోనివా రిని. ఇట్లు జగద్విదిత ప్రభావముగలవారిని దోఁచుకొందము. ఎవ్వరివలనఁ బ్రస్తుతకార్యము జరుగునో తెల్పుము.

ముగ్గురుతల్లులును జేతులెత్తి—'ఇంకెక్కడనున్నారు-ముందు మామీఁద వైరమెత్తి పుట్టవలయును.'

నార—అక్కఱలేదు- సిద్ధముగా నున్నది.

గంగ—ఎవ్వరామె?

ముగ్గురమ్మలు—ఊఁ; వట్టిమాట మేము వినకుండ నున్నామా?

నార—మీవలె మిద్దెలమీఁద మేడలమీఁదఁ దిరుగునదియైన మీకుఁ దెలిసియుండును.

ముగ్గురు- ఎవ్వరయ్యా! అంత నారలుచినిగిన నారలు గట్టి యడవులు పట్టియున్న పతివ్రత?

నార—అమ్మలారా! భూలోకములో.

ముగ్గురు—ఆ! మనుష్య స్త్రీలలో?

నార—అగునమ్మలార! భూలోకములో- మనుష్య స్త్రీలలో-'దుంపలు, తూండ్లు దిని యడవులవెంటఁ దిరుగుచున్నది. అత్రిముని యిల్లాలు! అనసూయ' మహాపతివ్రత!

ముగ్గురు—(తమలో) అనసూయ నెఱుఁగకేమి! రామాయణములో వచ్చినది.

నార—అగును, అనసూయ.

ముగ్గురు—సీతకు నలుఁగుఁబిండి, మెఱుఁగు బిళ్లలు చేసి యిచ్చినది.

నార—ఆమెయే- ఆమెయే- అత్రిరుషుల జోమ్మవలె మీకుఁ దోఁచుచున్నది. రాత్రుసాంధఃకరణమను కడియ మిచ్చినది యీమెయే.

ముగ్గురు—ఎఱుఁగుదుము. చెప్ప నక్కఱలేదు. జానకీ పరిణయ నాటకములో.

నార—మీ రెఱుఁగకేమి. నన్ను క్షమింపుఁడు.

ముగ్గురు—మంచిది- నీవు నడుమఁ ద్రోపుడుగాఁడవు కలవుగదా! మంచిది, మానవమానవతి మాచేతఁ గాని పని చేయఁగలదని నీవు తలఁచుచున్నవాఁడవు-కాని చేయింపుము.

నార—అందుకే క్షమింపుఁడని కోరితిని. మిమ్ము గాదని యెన్నఁడును గాదు. మీకూరకుండుఁడు- మీరీ పనికి రావలదని మొదటనే యంటిని.

ముగ్గురు—కానిమ్ము; ఏమట్టిపిల్లిగాని, ప్రాని పిల్లిగాని యెలుకను బట్టుట ముఖ్యము. దీని పర్యవసానము మాకుఁ దెల్పెదవుగదా!

నార—మీకుఁ గోపమువచ్చినట్లున్నదే.

ముగ్గురు—లేదు, లేదు.

గంగ—అమ్మలార! యీదీనుఁని లెక్క సెలవిండు. నేను గార్యము సాధించుకొనఁ బోయెదను. నారదుని బట్టి మీరు సాధింపుఁడు. నాకు సందు దొరకినది.

అని గంగ వారి సమ్మతి గైకొని భూలోకమునకుఁ బోయెను.

నారదుఁడు ఉత్సవసమయమునకు విష్ణుమూర్తి గారలంకారము చేసికొనుచున్న తావునకుఁబోయి 'తాతగారు! లక్ష్మిగలవారికి నాలుగు చేతులున్నను, ఇరువది గాదు ముప్పది వ్రేళ్లున్నను మురుగులు, మురిడీగొలుసులు బొటనవ్రేలు మొదలుకొని బటువులు విద్దెటుంగరాలు, చుట్టులు, కవురులు, పెట్టుకొనవచ్చును. భూలోకములోఁ గొన్ని కులములుగలవు. వారు జన్మములోనుండి స్త్రీపురుషులు స్థూలశరీరముగలవారు. మగవారికేమిగాని స్త్రీలు మీవలె నలంకారప్రియులు. నిర్భయముగా వారికిఁ బరిమాణాతీతములైన నగలు చేయించి పెట్టుచున్నారు. కొన్ని రోగభూములలో బోదకాలికిఁగూడ వారు కడియములు చేయించుచున్నారు. మీకు మీసములు లేవు. గనుక ముత్తెముగల కమ్మిగాని యడ్డబాసగాని బాగుగా నుండును. గడ్డాల భైరవులు, మహాదేవాదులకు వికారముగా నుండును.' అని హేళనముచేయుచు దగ్గఱఁ గూర్చుండెను.

వైకుంఠమునుండి గంగ వెల్లఁగాడిచుచున్నది. భూమికి సమీపించినది. ఇంతలో నాలుగైదువాళ్లు, పండుగలు, వేడుకలు, కాలక్షేపములు, సంపకములు, విందులు జరిగిపోయినవి. గౌరి, లక్ష్మి, సావిత్రి మరల నిల్లాలోచన సభగావించిరి. మన యొద్దకువచ్చినది మన చేతనగునో కాదో చూడకుండ నారదుని మాటలువిని గంగ

భూలోకములోని పేరంటాలి దగ్గఱకుఁ బోయినది. మనకుఁ జిన్నతనము గదా. అనసూయ యెంతపతివ్రతయో చూడవలయును. ఇతరులకుఁ దెలియరాకుండ గంగను వెంటాడి చూడఁబోదము రండని యొకరి నొకరు పిలుచుకొని చప్పుడుగాకుండ మనుష్యలోకమునకు దిగిరి. అత్రిముని యాశ్రమములోనికి గంగాభవాని దిగినది. 'ఆశ్రమము సమీపమున మనుష్యులు కనఁబడుదురా? ఏదయిన పనిమీఁద గొప్పవారిని జూడఁబోయినవారు తమంతట తాము గోత్రనామములు చెప్పుకొనుచుఁబోయి దర్శించుట యీభూలోకములో మర్యాద గాదు. మధ్యవర్తి యొక్కరు తీసికొనివెళ్ళిచూపించి వీరు వీరనిచెప్పి పరిచయముకలిగించిన మీఁద, రెండవసారి యెప్పుడు వెళ్ళినను బెత్తెఁడు చీటి ముక్క వ్రాసి లోనికిఁ బంపినఁజాలును. నన్నుఁ దీసికొనిపోయి యెదుటఁబెట్టి చెప్పువారెవ్వరు? ఉభయుల నెఱిఁగిన నారదుఁడుండవలసినది. పోనీ, నేనే దర్శనము చేసెదను. వీరు మహారాజులు, ధనవంతులు, నరులపై గొప్పయధికారులును గారు. వీరికి గుమ్మములో, సేవకులు లేరు. నేను వారిచేఁ బొగడించుకొనవలసినపని లేదు. నాగొప్పలు, నాయుఱుకులు పరుగలు వారియొద్దఁ గనఁబఱుపనవసరము లేదు. నేను గ్రంథము వ్రాసితినా? నాగ్రంథము పఠనార్హమని వ్రాసియిమ్మని, తప్పులతడికె నొప్పులకుప్పయని, పొగడించుకొనవలయునా! నేను జనోపకారకమైన యేపెద్దపని చేసెదనని—లేదు. నావిరోధులనుండి తప్పించుకొనుటకు నారోగము కుదుర్చుకొనుటకు వారిపాదముల పైఁబడుటకు— సమయములు, మధ్యవర్తులు, రాయబారులు, నక్కఱలేదు. ధర్మవైద్యశాలలవారు ప్రాణాపాయకర రోగములకుఁ జికిత్సచేయుటకై వేళపాళలు చూడరు. ప్రతిక్షణము సిద్ధముగా నడుము కట్టుకొని - యేసమయములో నెవ్వరు పిలుతురోయని- రాత్రి ప్రక్కపైఁగూడ సన్నాహముతో నిద్రింతురు. అనసూయ మహాత్మురాలు. అత్రి మహాతపస్వి. నన్నుఁ గాంచి కొంచెమైనను గౌరవింపరా?' అని జోరీఁగలగొడ్డువలెఁ దనచుట్టునున్న పాపములను దోలుకొనుచుఁ జేతులతో ముసరికొనుచుఁ బర్ణశాలదాపునకు నడచినది.

ఎండలు తీక్ష్ణముగాఁ గాయుచున్నవి. అత్రి కమండలువులోనిజలము చెల్లినది. మరలఁ గొంచెము నీరు త్రాగవలయునని- యాచమనము చేయవలయునని తలంపుగలిగినది. భార్యను నీరు తెమ్మని యానతిచ్చెను. ఉటజములో (పర్ణశాలలో) నీరు లేదు. వెదురు బిందెలో నీరుచుక్క కూడ లేదు. చెఱువులా, నూతులా. నాపతియాజ్ఞ నెట్లు నెఱవేర్తును? నీరు కోరెను, కోనేరు చాలదూరము; ఏఱు కడుదవ్వు, తెల్లవాఱుజామున నదికి వెళ్లివచ్చువారము. ఈయెండలో నడువఁజాలను. ఎక్కడనయినను నీరు వెదక వలసినదే. పెనిమిటి మాటకుఁ బ్రతిచెప్పుటగాని, బద్ధకించుటగాని కూడదు. నీరే ప్రాణాధారము. దానికై వెదకెదను. అని పతివ్రత కలశము పట్టుకొని యావలకువచ్చి, చుట్టు ప్రక్కల మునులనయిన యాచించి తెచ్చెదను. ఉదయమున లేనినదులు ప్రవాహములు నేనెఱిఁగనివి యీ యడవిలో నెక్కడనుండి యిప్పుడు నాకోసమెవ్వరు తెత్తురు. అని దీనవదనముతో రాతిక్రింద బండక్రింద వంగిచూచుచు, చెవియిచ్చి వినుచు గన్నుదెఱచి చూచుచుఁ దిరుగాడుచుండిన పతివ్రతాతిలకమును గంగ దర్శించినది. ఆమె మొగము, తలంపులు, పెదవులు తడవుకొనుట, మెల్లగ మాటలాడుట, కనిపెట్టినది. 'అమ్మా! నమస్కారము. నీ వేమి వెదకుచున్న దానవు. నాతోఁగొంచెము సెలవిమ్ము' అని గంగ ప్రార్థించెను. 'నాపతి నాదైవము. ఎంతకష్టపడియైనను వారి యాజ్ఞ గావించుచుందును. ఇది నా వ్రతము. నేఁటివఱకుసాగినది. ఇఁక దానికి భంగము రానున్నది. జలము తెమ్మనిరి. ఇంట లేదు. ఎండమిక్కుటముగానున్నది. నీరు త్రావకున్న నొకప్పుడు ప్రాణహాని, సంకల్పాదుల కాచమనమునకు లేకున్నఁ గర్మహాని, యెట్లుర్రా భగవంతుఁడా యని చింతిల్లుచున్న దానను. ఎక్కడనైన దొనయున్నదా? సెలయున్నదా? బావిగుంట కనఁబడునా? అని తిరుగుచున్నదాన.' ఇట్లని పతివ్రత తనకుఁగావలసిన విషయము తెల్పెను. 'దీనికై మీరు శ్రమపడవలదు నేను దెచ్చెదను. ఆ పాత్రమిటు తెండు. నేను దాఁకవచ్చునా? యని చేయిచాఁచెను. 'సరిసరి, మీ కంటె నాకాచారమా?' మీకేల శ్రమ? మీతో నేను వచ్చెదను.' అని యనసూయ యుపచరించినది. ఇటు రండు. ఈ బాయిదొరకించిన మీకుఁ గావలసినంత జలము.' అని చేతితో నొక్క పడుకుఁ దిరుగవైచినది. ఆవంతలో నెక్కడనుండి లేచినదో, జలజల-గలగల- ప్రవాహము!



ఎక్కడనుండి లేచినదో, జలజల - గలగల -
ప్రవాహము ! ... ఒక్క జెలలోనుండి.

ఒక్క జెలలోనుండి - అద్భుతము ! తొలుత వచ్చిన కళ్ళలము తొలఁగనిచ్చినది. పిమ్మటవచ్చిన కలకనీరు విడిచినది. తర్వాత తేటనీరు రాఁగాఁ బాత్రము పట్టి యనసూయ నిండించి, యంత ముఖము చేసికొని -'చల్లని తల్లి మీరెవ్వరో తెలిసికొనవచ్చునా ? నావలె మీరును మిట్టమధ్యాహ్నమున రాఁగతంబేమి ? రండు నీరుకొని పోయి నాభర్తకిచ్చి యాశ్రమములో మాటలాడుకొందము-' అని వేఁడినది. 'తల్లీ! నేను దీనురాలను; ఆయుధము చేతనున్నను గొట్ట జాలనిదానను, కొట్టుటకు స్వాతంత్ర్యము లేనిదానను, గంగను. నన్నుఁ బాపములుచుట్టుకొని బాధించుచున్నవి. ధర్మశాస్త్రము గర్వవాక్యములు చూడుఁడు. ఒక్కరు తన్నుఁగొట్టినఁ దానుగొట్టరాదట. తనకు మొట్టువెట్టుకొనవలెనట. మరలఁదామే చెప్పును. కొట్టినదానికంటెఁ గొట్టైదనుట గొప్పనేరమని. నాస్థితిఁజిత్తగింపుఁడు. ఆకాశవాణి, మహాపతివ్రతవలనఁ గాని నీకు వచ్చిన యీ బాధ తీరదనియెను.

నారదుని వలన మీమహత్త్వము తెలిసికొంటిని. మీ దర్శనమే పనిగా యీయెండలో వచ్చుచుంటిని.' అని విన్నవించిన మిన్నేటినకు 'హే గంగే! మంగళతరంగే !' అని యనసూయ నమస్కరించి, 'అమ్మా! నన్ను క్షమింపవలయును. నేనెంతటిదానను. నామహత్త్వమెంత ! కొడుకులా! కొమ్మలా! ధనమా! ధాన్యమా ! యిల్లా! వాకలియా ! ఉందురు మహాపతివ్రతలు. వారులేనిదే లోకము నిలువదు. వెదకఁబోవచ్చును. నేనశక్తురాలనైనను నాకు నీవు చేసిన యుపకారమునకై కొంతసేపు మాకుటీరములో నిలుపుకొన నిచ్చపుట్టుచున్నది. నాతో రావలయు' నని కోరినది. 'ఓజననీ ! నీకంటె వేఱు మహాపతివ్రతలుందురు. లేకుందురు. నారదుఁడేమియు నాలోచింపకుండ మిమ్ముఁ దెల్పలేదు. నా కార్యము దీర్చుటకు మీరే సమర్థులు. నామనోజవమట్లేయున్నది. నేను వేఱొకరిని నమ్మలేదు. "అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణంమమ." నాకు వేఱుశరణములేదు.' అని గంగపలికి చేతులు జోడించినపుడు, 'నేనల్పురాలనైనను నాయందు నీకున్న విశ్వాసమైనను నాకుఁ దోడ్పడునుగాక ! నాకుఁ గావించిన యుపకారమునకైన నేను బ్రత్యుపకారము చేయయత్నించుట నావిధి. చూచెద'నని కాలుసేతులు కడిగికొని యాచమనముచేసి, భర్తను మనస్సునందలంచుకొని పుడిసెఁడు నీరు చేతఁబట్టి - 'ఓ పాపములార ! నేనే పతివ్రతను - నాదే సత్యవాక్యము - అని నారదాదులు తెలిసికొన్నది వ్యర్థముగాకుండ మీరు నశించి భస్మమైపొండు. మీదుష్కార్యములకు ఫలమనుభవించి పెద్దల సత్యవాక్యమును నిలువఁబెట్టుఁ' డని కన్నులు మూయఁబోవునప్పటికే కొన్ని దూరముగాఁ బాటిపోయినవి, కొన్ని తొలఁగఁబోవుచున్నవి, కొన్ని మమ్మొక్కరేమిచేసెదరని నిర్భయముగా నక్కడనే పండ్లిగిలించి చూచుచున్నవి. కన్నులు విచ్చినీరు గంగకుఁ జుట్టును జల్లినది. అల్లంతదూరమునఁ జిటచిటమ్మను ధ్వని వినఁబడినది. కొంతదూరమునఁ బటపటమను శబ్దము వినవచ్చెను. గంగచుట్టును బ్రేలాపన నిప్ప

మంటలు లేచినవి. అనేక విధములుగాఁ బాపములన్నియు బ్రద్దలైనవి. బూడిదె ప్రోగయినది. నీళ్లుగారుచున్న గంగకుఁ దలగడుగుకొన్నట్లు శరీరము తేలికపడియెను. గంగకు సంతోషము పట్టఁజాలకుండఁగలైను. "నారదుఁడు నాకు మహోపకారి. నాకు నీవు తల్లివలె నడ్డుపడి నన్నుఁ గాపాడితివి. నీకు నేను కృతజ్ఞురాలను. నీమేలు మఱువను. మీపర్ణశాలకు దాపుగ నీజల ప్రవాహ మెల్లప్పుడుఁ బాఱుచుండును గాక; ఇది మీస్నానపానకముల కుపయోగించును గాక; దీని నిట్లుండ నిమ్ము. నీదర్శనమైనది, కృతార్థురాల నైతిని. సెలవిండు. నేను బలుతావులకుఁ బోవలసినదానను, ఒక్కచో నిలుచుట కష్టము, నాకుఁ ద్రిప్పట యెక్కుడు. నాకాలు నిలువదు. నాయనగారికి నానమస్కారములు నివేదింపుము." అని పడిపడి దండములు పెట్టి గంగ వేంచేసెను. అనసూయ తన భర్తకడకుఁ జని సవిస్తరముగ జరిగిన దానిం జెప్పెను. ముగ్గురు శక్తులును మూతులు బిగించికొనుచు నిజనివాసములకుంజనిరి.

సోదరీమణులారా! ముల్లోకములు ముట్టుకొన్నవి. సత్యలోకములో సావిత్రియాలమున వైకుంఠములో లక్ష్మీకారణమునఁ గైలాసములో గౌరికతమున- అనసూయపైఁ గసరుపుట్టి - అసూయలేచి - అహంకారము మెండై సాగ రాఁజుకొనఁ జొచ్చెను. సావిత్రి - తిండితినక, నిద్రపోక, అనసూయపైఁ జూపోపమిచే నెగరోఁజుచుఁ జిక్కులు పెట్టుటకు మార్గములు వెదకుచుండెను. తనయింటిలోనున్న దుర్వాసుఁడు మొదలైన తలతిక్కమునులపద్దులు తిరుగవైచినది. అట్టెముసలి - అట్టెపడుచు కాకుండ నడితరము వానిని బిలిచి - 'నీవు నిర్భయముగ భూలోకములో అనసూయయొద్దకు వెళ్లి యెన్నివిధములనైన బాధించి చిక్కులు పెట్టి చీకాకు పఱచిరమ్ము. ఎట్లయిన వంచించి రావలయును.' అని పంపిన మునివచ్చి - అత్రిమునికిఁ బ్రక్కవైచి పండుకొన్న తరువాతఁ దొడమీఁదఁ గాలు పెట్టి నిద్రపట్టుటకై మెల్లఁగ నెత్తుచుండిన సమయము గనిపెట్టి, 'అనసూయా! భిక్షాం దేహి. ఆఁకలి, ప్రేఁగులు మాఁడుచున్నవి. గొంతుక యెండిపోవుచున్నది. నాలుక పిడుచగట్టికొనిపోవుచున్న'దని యెండు నాలుకతో నఱచెను. ఈవలకు వచ్చుటకుఁ గాని వచ్చుచున్నదానవని యఱచుటకుఁ గాని సమయముగాదు. కొంతజాగుచేసివచ్చినది. మునికోపగించి తలలోని యొక జడను బెఱికి నేలఁ బెట్టికొట్టెను. దానిలో నొక రాక్షసుఁడు పుట్టి నోరు దెఱచికొని పళ్లెరములో నన్నము పెట్టుకొనివచ్చు పతివ్రతపై నట్టహాసము చేయఁబోయి వెనుకకుఁ దగ్గి-దండము నేలఁగొట్టి మునిమీఁద నే పడి గోళ్లతోను గోఱలతోను జీరిచంపి శవమును బట్టుకొని యెక్కడికో పోయెను. సావిత్రికి గర్వభంగమైనది.

పార్వతికూడఁ గొంత చిన్నతనపుఁబని చేసినదని చెప్పుకొనుచున్నారు. అదిచెప్పుట నాకు సిగ్గగానున్నది. లోకమాత యట్లుచేయునా! ఏమిచేయుదును? సిరియాళచరిత్రములో శివుని గారిని సొగటాలయాటలోఁ బెట్టితిని. శివరాత్రి మహాత్మ్యములో శివునిచే గంజాయిపత్రి పీల్పించితిని. దేశీమెల్లవారు నెట్లుచేయించిన నట్లుచేయుటకు సిద్ధపడు వీరు సర్వేశ్వరులని యెంచి లోకులయాటలనే నేను నాడింపకున్న మూర్ఖులు నన్ను నిందింతురు గావున - ఊఁ! మీరట్లు తలంపవలదు. పార్వతి మట్టయినది. గంగచేఁపలది - కృష్ణుఁడు గొల్లవాఁడు - అరుంధతి మాలది. ఇట్లని చెప్పువారిని, గాదనిన నీకేమి తెలియునని కొట్టవత్తురు. నేను వ్రాసినదానినెవ్వరయినఁ జదువవలయునను తలంపే నాకున్న - వారని నట్లే యనవలయును. నిజమాడిన నిష్ఠురము. మూర్ఖులే కాదు. ఒక పండితుఁడు. 'కాళిదాసుగారు రాజులేని సమయములో భోగముదానియింటిలో-' అనియేమో కథ చెప్పుచున్న నేను నవ్వితిని. ఒక్క కాళిదాసుగాదు; ఇద్దఱో ముగ్గురో యున్నారని చెప్పుదురు. వారికాలనిర్ణయము తేలక చరిత్రము తెలియక తలక్రిందుపడుచున్నారు. కాళిదాసేమి భోగముదానియింటిలో నిక్కేమి- యంటిని. అట్లయిన భోజచరిత్రము - అక్షరలక్షలు - అబద్ధమేనా - నీది వెఱ్ఱితనము. అనిపదిమందిలోఁ దిట్టినాఁడు. ఆయన తిట్టినకొలఁది నాకునవ్వు. పిట్టకథలు నమ్మినట్లులు సత్యకథనమును లోకులు నమ్మరు. తెనుఁగువారు- అఱవవారు కట్టికల్పితకథలు చాలఁ దెలిసిన వారుకలరు. అత్రి తనయిల్లాలితొడలపైఁ బాదములుంచి పండుకొనియెను. ఆసమయమునఁ బార్వతి తనమగనియొడలి భూషణములలోని యొక పామును దీసి సేవకుఁడగు ప్రమథుని చేతి కిచ్చి వారి మీఁదఁబడవేయుమని పంపినదఁట. ప్రమథుఁడు మెల్లగాఁ ద్రాఁచును అనసూయమీఁద

కెక్కినట్లు విడిచిపెట్టెనట - సర్పము మెడమీఁదికెక్కి మొగముమీఁదికిఁ బడగెత్తి తొంగి చూచుచుండఁగా నాయమ్మకనిపెట్టి నిర్భయముగఁ గదలక మెదలక యున్నదది పూవులమాలయై మెడలో నల్లేపడియుండెను. నిద్రనుండిలేచి అత్రిముని యీమాలయెక్కడిదని యడిగెను. గౌరిపంపినదని దానిని బామునుగా మార్చితోలి వేసెనఁట.

లక్ష్మి ధనగర్వముచే నేమిచేయించిన దనినను సమ్మనవచ్చును. ఆమె తనకుమారుఁడగు మన్మథుని, వసంతుని దోడిచ్చి పంపి, అనసూయకు పనోవికారము కలిగింపుమని ప్రోత్సాహపఱచెను. ఈనడుమ నొక్కవేదరాలు తన ముగ్గురు బిడ్డలతో నెక్కడనుండియో వచ్చి యత్రిముని యాశ్రమము దగ్గఱ నిర్భయముగా నుండునని చెట్టులనీడఁగూర్చుండెను. ఆబాలురను గాంచి అనసూయనాకు బిడ్డలు లేరు. పుత్రులుగల తల్లిదే యానందమని మనస్సునఁ గొంచెము విచారము నొంద, దానిని భర్తయెఱిఁగి నీవు విచారింపకుము. నేను బదరికావనమునకుఁ జని నారాయణమూర్తిం గూర్చి ఘోరతపంబొనరించి పుత్రుంబడయుటకు వరము గొనితెత్తునని తన యుద్దఱు శిష్యులను, "అనసూయకు సహాయముగానుండుఁడు, ప్రాఁతపాఠములు వల్లించుకొనుచుండుఁ"డని ఆశ్రమము విడిచి యెందును బోవలదని-"ఇతర మునికుమారులతోఁ జదువులో గర్వమునఁ బంతెగింపరాదని" బోధించి - ఇంకనెన్నియో నీతులు చెప్పెను. వానిని మేము వేఱుగ నొకనీతిగ్రంథము వ్రాయఁదలఁచియుంచుట విడిచితిమి. అత్రి బదరికాశ్రమమునకు వేంచేసెను. ఆవేద బిడ్డలకు రొట్టెలు, పండ్లుపెట్టి వారి యాటలు వినోదములు చూచుచున్న యనసూయకడకు మన్మథుఁడు, అత్రిముని వేషము దాల్చివచ్చి తనచమత్కారములు గారడివానివలె సంచివిప్పి చూపఁబోయెను. ఈదుష్ట చేష్టితములను గ్రహించి - నీయాటలు నాయొద్దనా! నీ చర్యలకుఁ దోడు మాయవేషములు కూడ నేర్చిన లోకమున మర్యాదలు నిలుచునా. తొలఁగిపొమ్ము. నాయెదుట నుండరాదు. నీవైదునిమిషములలో నీసామగ్రితో నీపరివారముతో నాయాశ్రమము విడిచిపోవలయును. అని పలికిన మన్మథుఁడు సిగ్గుపడి వెడలిపోయెను. లక్ష్మి

యేమిజరగినదని కొడుకు నడుగలేదు. తల్లితోఁదనయవమానమును గొడుకు చెప్పలేదు.

ఒక్కరొక్కరిగర్వము నీరీతిగా సన్నగిల్లినది. కానిమనస్సులోనసూయమఱింత వృద్ధి పొందుచున్నది. అనసూయ పాతివ్రత్యము వారికి ఘనమనిపించినది. దానికింకొక్క చిన్నవిషయముతోడైనది. వినుండు.

ఒక్క బ్రాహ్మణకన్యగలదు. ఆమెపేరు నర్మద. సద్గుణవతి, విద్యనేర్చినది, బుద్ధిగలది, యని పేరుపొందినది. కన్యాత్వముననే దైవవశమున మరణించి స్వర్గమునకుఁబోయెను. ఏమూలనో యొక్కమూలఁ బడియుండమని యెన్నక పెద్దకుండల కెసరుపెట్టు మనవారిం జూచుటలేదా. ధనమున్న హాయిగా నొకరికిఁ బెట్టి తాము తినియుండక, ధనము వ్యర్థముగా సెలవుచేయుచుఁ బెద్దపెద్దపదవులకు, కార్యదర్శులను మంత్రులను, గావలయునని యెన్నికలు,పరాభవములు,న్యాయస్థానము కెక్కుట మనకు విదితమే. నర్మద,చేరితిని,నరకముగాదు స్వర్గము. కడుపులోని చల్లకదలకుండ నొక్కచోట నెక్కడనో వారు చూపించినచోటఁ గూర్చుండమనక, పతివ్రతలలోఁ జేరుదమని యత్నము. నేను బతివ్రతలలో నొక్కతెనుగా నిలిచెదనని యభిప్రాయము నడిగినది. తగునని కొందఱు, కొన్నిగుణములు తక్కువయని కొందఱు, నింద్రసభలోఁ దర్కించిరి. ఇంద్రునకు మనవి వ్రాసికొన్నది. కాగితము సభలోఁబెట్టినాఁడు. సభలో ధర్మసందేహము- ఉపసభయొకటి నిర్మించి యీవిషయమై చర్చించి నిర్ధారణచేయుఁడని యింద్రుఁడాకాగితము మీఁద వద్దుగావ్రాసి బృహస్పతి యొద్దకిఁబంపెను. కొన్నిదినములవఱకు దానిని బుట్టలోఁ బడవైచిపెట్టిరి. చిత్రగుప్తులయొద్ద నాకాగితమునకు బదులువచ్చినదాయని నర్మద యడుగుచుండును. ఒక్కనాఁ డుపసభకూడినది. ఎన్నుట, బలపఱచుట, చప్పటులు చఱచుట, నేనెంతటి వాఁడను, మీరు నాకీ గౌరవమునిచ్చిరి. అర్హుఁడను గానని మీరెఱిఁగియేయున్నారు. నన్నుఁ బీటమీఁద నాఁడుబడుమనువలెఁ గూర్చుండఁబెట్టి మీరే యీకార్యక్రమమునందు భంగములేకుండ సభను నిర్వహించుకొందురని ప్రార్థించుచున్నాఁడనని యధ్యక్షుఁడు తన వినయభావమును, వాడుక ముక్కలను వెలిపుచ్చుట-గొంతు

సవరించుకొనుట కూర్చున్నదిమొదలు సభాధ్యక్షునికి బల్ల క్రిందినుండి ప్రక్కబారునఁ జీటులందించుట మీరే మైన నాల్గుముక్కలు చెప్పుడని ప్రక్కవారిని గిల్లుట యిట్టితంతు ముగిసిన పిమ్మట- యథావిధిగా కార్యక్రమము బల్లమీఁదఁ బెట్టలేదేమి యని చిత్రగుప్తునిపైఁ గార్యదర్శి కన్నులెఱ్ఱచేసెను. ఇందేమున్నది. ఒక్కటే యంశము. దీనికిఁ గార్యక్రమ మక్కఱలేదని తేలేదని చిత్రగుప్తుఁడు సమాధానముచెప్పెను. తేలేదుగదాయని చెప్పుము. అంతియకాని సభాక్రమమునకు విరుద్ధముగదా! అధ్యక్షుని యెన్నిక నేఁడేమి క్రొత్తయనియీ యీ చప్పట్లు మొదలైనవి. ఇది యొకపద్ధతి. కానిండు. నర్మద ప్రార్థన మొక్కటియే నేఁడు చర్చింపవలసినది. అని సభవారు సభాధ్యక్షునితో లేచి చెప్పిరి. కట్టిపెట్టెదను. మీకీహాస్యము చెప్పను. సభ జరిగినది. తీర్మాన మిట్టులు చేసిరి.

"ఇంద్రుఁడుగారు నియమించినట్లు నర్మద ప్రార్థనమునకీ సభవారిట్లభిప్రాయ పడుచున్నారు. కొన్ని కొన్ని చట్టములపుడపుడు రద్దుచేయుట, మార్చుట, సవరించుట మొదలైనవి కొన్ని రాజ్యములలోఁగలదు. ఇక్కడ బహుకాలమునుండి యట్టి తలంపే లేదు. పూర్వాచారము ననుసరించి కవచధారిని గుడిలోనికి రానీయమని ననిపుడు, కవచములు, మీసములుముందుజుట్లులేనివారెవ్వరు? ఈచర్చముందు ముఖ్యముగా జరుగును. ఇక నర్మదను గూర్చి పూర్వశాస్త్రముల ననుసరించియే యిప్పటి తీర్మానము. విధవల కట్టడములలోనికి వారెన్నివిధములుగాఁ జెడినను విధవలే చేర్చఁదగుదురు. కన్యల కట్టడములలోనికిఁ బెంపనరసి చచ్చినను గన్యలనువారే రావలయును. వివాహమైన ..రికట్టడములలోనికి నాకబలి నాఁడుచనిపోయిన ముదువకుమంగళస్నానములుచేయుచుఁ జచ్చినను వివాహసంస్కారమైనదనిపించుకొనిన వారే రావలయును. విధవలని వివాహితలని భేదము లేకుండఁ బతివ్రతలందఱు నొక్కభవనములో నుండవచ్చును. కాని వివాహముకాని దాని పాతివ్రత్యము పరిశీలన కెట్లువచ్చును? పతివ్రతయనఁగా దాత్పర్యమేమి? పతినిదైవముగా వ్రతముచేయునది. పతిని బూజించునది ఇట్టెన్నియో రీతులు. ఎన్ని రీతులనాలోచించినను బెండ్లికాని వారికిఁ బతులున్నారో లేరో బహిరంగముగాఁ దెలియదుగానఁ గన్యకలు (కన్యకలనఁగాఁ జిన్న పెద్ద భేదములేకుండఁ బెండ్లికానివారు) పతివ్రతలలోఁ జేరుటకు వీలుకలుగదు."

ఈతీర్మానము నేకగ్రీవముగా నామోదింపనివారున్న యెడలఁ జేతులెత్తమంటిమి. ఒక్కరును జేయెత్తలేదు. కాఁబట్టి తీర్మానమయినది. అని యధ్యక్షుఁడు చేవ్రాలుచేయు నప్పటికిఁ గొందఱు సభ్యులు దీనికంటె ముంగు, దీనికంటె ముఖ్యమైన సభలోనికి వెళ్లవలయునని లేచిపోయిరి. నేను గంటక్రింద నేవచ్చినట్లు వ్రాసి కొందఱు కూర్చుండిన వెంటనేవెళ్ళిరి. కరతాళధ్వనులతో (చిత్రగుప్తులుమాత్రమే) సభ ముగిసినది. దేవేంద్రుఁడుగారి యొద్దకుఁబంపిరి. దానిప్రతి యొకటి నర్మదకిమ్మనిరి. చిత్రగుప్తులట్లుచేసిరి. నర్మద పదిమందికిఁ జూపించినది. ఎవ్వరికిఁ జూపినను నిష్ప్రయోజనము. భూలోకమునకుఁ బోయి పెండ్లియైన దనిపించుకొని రాకున్న వీరి పట్టు వీరువిడువరు. అయ్యో, తీర్మానముల



సూర్యుఁ డుదయింప కుండునది యని నర్మదపలికెను.

సంగతియె యిట్టిది శాస్త్రని యందఱును జెప్పిరి. తప్ప దని నర్మదకుఁదోఁచినది. పెద్ద పేరవచ్చునని యే కాని పడవలసిన కష్టములెన్నోయని యాలోచింపరు. భూలోకమునకువెళ్ళి, కుష్ఠవ్యాధి, ముసలితనము, చిఱ్ఱికోపము, పెండ్లి చేసికొనవలయునను నాశయుఁగల యొక బ్రాహ్మణుని, వీఁడు శీఘ్రకాలములో మృతినొందును. విధవనైనను పతివ్రతలలోఁ జేరవలయునను పట్టుదలతోఁ బెండ్లియాడినది. అతఁడామెను బహుబాధలు పెట్టెను. తిట్టెను, గొట్టెను, చెప్పనేల? ఒక్కనాఁడు నడువలేను. నన్నెత్తుకొమ్మని కఱ్ఱతోఁగొట్టి, పుంటికాలు కడిగి యీఁగలు వాలకుండఁ గట్టుకట్టి నదికి స్నానమునకుఁ దీసికొని పొమ్మని ముసలి బ్రాహ్మణుఁడు పట్టుపట్టెను. భుజముమీఁదఁ బెట్టుకొని మోచి నది యొద్దనుఁజేర్చినది. కన్నులు కానరాకతపస్సు అచట చేసికొను నొక యోగిని ద్రొక్కినాఁడు. అతఁడు దానికిఁ గోపగించి నీవు సూర్యోదయము కాఁగానే చత్తువని శపియించెను. నామగఁడు చనిన నేను విధవ గావలసివచ్చును. ఈరెండు కష్టములు రాకుండుటకై సూర్యుఁడుదయింప కుండునదియని నర్మద పలికెను. లోకములు చీఁకట్లు కప్పినవి. ఒక్కరికిని దోపకుండెను పట్టపగలు దీపములుపెట్టుకొని తిరుగుటకును గష్టమేగదా! దేవతలు, దానవులు, మానవులు నేకమైరి. ఏమి చేయుఁదమాయని సర్వవర్ణ సమామ్నాయ సభ జరిగినది. నర్మద మనమాటలకు లక్ష్యపెట్టదని కొందఱు, ఆఁడుదానిని మగవారు ప్రార్థించుటకు సిగ్గులేదాయని కొందఱు, సిగ్గు పౌరుషములున్నచో సూర్యునిఁ బొడిపించుకొనుండని కొందఱు కొట్టుమిట్లాడిరి. ఇంతలో నొక కొలువి పాలకఱ్ఱ వెలిఁగించుకొని నారదుఁడువచ్చెను. మీరు మీరు గింజుకొన్నను, సూర్యుఁడుదయింపఁడు. నామాటవిని మీరందఱునుగలసి అత్రిముని భార్య మహాపతివ్రతయగు నన ముగ్గురు మూఁడుచంటిబిడ్డలైరి. కేరుకేరుమని యేఁడువఁజొచ్చిరి.



సూయను వేఁడుకొనుఁడు. ఆమె వచనములకు నర్మద వెనుకదీయదు అని చెప్పిపోయెను. పెద్దకాఁగడాలు వేయించుకొని యందఱును మహాపతివ్రత కడకువచ్చి గోలవెట్టిరి. పాపమామె వారినెల్లర వెంటఁ బెట్టుకొని నర్మద యొద్దకువచ్చి సూర్యుఁ డుదయించుటకు సెలవిమ్మ. నీపెనిమిటి చనిపోయిన నేను బ్రదికించెదనని నర్మదను బతిమాలెను. ఆమెయట్లు చేసినది. ఈమె యిట్లు చేసినది. పైఁగా నాబ్రాహ్మణుడు రోగములన్నియుఁబోయి దృఢశరీరము, యౌవనమునువచ్చునట్లు ననసూయయనుగ్రహించెను. ఈపతివ్రతమహిమ గౌరిలక్ష్మి సావి

త్రులకు మఱింతయసూయను గల్గించినదట నింతలేదు గదా.

తమతమ పతులను జేరి 'వలదు; ప్రయోజనములే' దని వారెంత చెప్పినను వినక మూర్ఖపుఁబట్టుపట్టి మీరు స్వయముగాఁ జని యనసూయను మోసపుచ్చిరమ్మని కోరిరి. అయ్యో, మేమును స్త్రీలమాటలు పట్టుకొని తిరుగ వలసినదేనా. అత్రియింటలేడు. ఎట్లీపనిచేయఁగల మని చింతించుచునే త్రిమూర్తులును (బ్రహ్మ విష్ణు మహేశ్వరులు) అనసూయ కడకు యోగిరూపములతోవచ్చి మా కాకలిగానున్నది. మీయింటనున్నదే చాలును. మేము స్నానము జపముచేసికొని సిద్ధముగ నున్నారము. నీవు వస్త్రము విప్పివైచికొని వడ్డింపుమనికోరిరి. కోరిక యామెకుఁ జిరాకుపుట్టించినది. కాని సమయోచితమైన యూహాయామెను గాపాడినది. కూర్చుండుఁడని పీఠములుపెట్టినది. కూర్చుండిరి. కమండలువులోని నీరు కొంచెము తీసికొని వారి ముగ్గురమీఁదఁ జల్లిన ముగ్గురు మూఁడు చంటిబిడ్డలైరి. కేరుకేరుమని యేడువఁజొచ్చిరి. ఇంతలో దిగంబరయై పాత్రలలోవడ్డించి మరల బట్టకట్టుకొన్నది. కాని బిడ్డల యేడుపు తనకు జాలిగొలిపినది. తానొకబిడ్డను తన శిష్యులిద్దఱు ఇద్దఱు బిడ్డలనెత్తికొని యాడించుచుండిరి. నారదుఁడు పరుగెత్తుకొని ముగ్గురమ్మల దగ్గఱకుఁబోయి,'యిట్లిట్లుజరిగినది. మాయమ్మలార! మీరీ గొడవకు రావలదని చెప్పితిని. నామాట వినలేదు సరిగదా పైఁగా నిట్టితప్పుపనిచేయించిరి.రండు. మీరువచ్చి యనసూయను బతిమాలుకొనుఁడు. అత్రి యింటలేఁడు. కాఁబట్టి మగవారిమాట లామె వినదు. స్త్రీలను స్త్రీలే పలుకరింపవలయును. మించినది. నాతోఁజెప్పరాదా. నన్నుఁబంపరాదా. పెద్దతలకాయలకు గౌరవహానికలిగిన లోకములో నెంత చిన్నతనము. రండురండు. జాగుసేయ వలఁదని గుండెలు కొట్టుకొనుచు తనవెంటవచ్చు వారికి నారదుఁడు,అనసూయదర్శనమునకుగొనివచ్చెను.'అమ్మా! మమ్ము రక్షించి మాకుఁ బతిభిక్షపెట్టు'మని గౌరియు లక్ష్మియు సావిత్రియువేఁడుకొనిరి. 'మీకేమి! పతిభిక్షయేమి! నేనేమిచేసితినని యనసూయ వింతపడియెను. 'వీరు ముగ్గురు మాభర్త'లని వారు చెప్పుకొనిరి-'నాకు బిడ్డలు లేరు. నేనీయఁజాల'నని యనసూయపట్టుపట్టివారిని దిరస్కరించినది. అపుడు వీరు ముగ్గురును గోలుమనిరి. ఆకాశవాణి, 'అనసూయా! నీపతి భగవంతుని వరము గోరి తెచ్చుచున్నాఁడు. ఈ త్రిమూర్తుల యంశమున నీకొక్కకుమారుఁడు కలుగును. వీరి పతులను మరల నిజస్వరూపులనుజేసి యిచ్చివేయుము. దీనివలన నీపతి ప్రతాత్వము మఱింత వన్నెకెక్కు'నని పలికెను. ఇంతలో నత్రిమునివిచ్చేసెను. నీరు మంత్రించి చల్లి బాలురను త్రిమూర్తులనుజేసి యెప్పటియట్లనిలిపెను. త్రిమూర్తులును వారివారి భార్యలవంకఁ దలలు వాంచి చూచుచు మీకు శృంగభంగము చక్కఁగానైనదని సంజ్ఞలుచేసిరి. నేను, మీరు పరమపురుషులని యెఱుఁగను. ఎవ్వరోయతులని తలంచితిని. నన్ను క్షమింపుఁడని యనసూయవేడికొనియెను. నీ తప్పింతకైనను లేదని వారు సపత్నీకులై దయచేసిరి. నారదుఁడు వారితోఁ గొంత దూరమువెళ్ళి నాకు దత్తాత్రేయదర్శనముచేయ వలయుననియున్నది. సెలవిండని తిరిగివచ్చెను. అనసూయగర్భమునఁ గొన్ని దినములకు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల యంశంబుల నొక్క పుత్త్రుఁడు దత్తాత్రేయుఁడు జన్మించి యాముని దంపతులకు హర్షము గలిగించెను. దత్తాత్రేయుని వర్ణించుట నాతరముకాదు. రవివర్మ పటములోఁ గొంత వివరముజూచి యెల్లవారు నానందింతురు గాక!



